# జమీన్ రైతు

ESTD. 1930
Regd. No. H. NL. 18
సంపుటి: 59 సంచిక: 6
5-2-1988
శుక్రవారం
10 పేజీలు రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు • • • మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి


## ముఖ్యమంత్రికి తలతిరిగి ముద్దనోట్లోకి వచ్చిందా?

శ్రీనివాసులురెడ్డి రెడ్డో, హైకోర్టు తీర్పో తెలియదుగాని ముఖ్యమంత్రి రామారావు హఠాత్తుగా వచలి ఇప్పుడిప్పుడే వానప్రస్థంలోకి వస్తున్నారు. తన తండ్రికి మూడేళ్ళనే మూర్ఖత్వమున్నంది, చిన్నప్పుడు చెప్పిందే వేదం అనే నిరంకుశ ధోరణి మెండు. ఆయన పతివ్రత దానిలో వర్దాయు తమిళనాడుతో బాటకి మంత్రిపదవిని ఎత్తరభదేవి రాష్ట్రీకరిపాలన విధించే వరికి ఆయనలోనూ భీతి కొంపద్దదేమో. తన పార్టీవారిపట్ల చండశాసనుడుగా వుండిన రామారావు, ఇప్పుడు వారిపట్ల బుజ్జగింపు వైఖరి వహలంభిస్తున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే ముఖ్యమంత్రిగారికి తలతిరిగి ముద్ద నోట్లోకి వచ్చింది!

పంచాయతీ ఎన్నికల సంగతే తీసుకోండి- ఇంతకాలం ఇన్నిసార్లు ఎందుకు వాయిదా వేసుకుంటూవచ్చారు? ఇప్పుడెందుకు హఠాత్తుగా మార్చి మొదటి వారంలో ఎన్నికలు జరుగుతాయని ప్రకటించారు? సహకార సంఘాలవలెనే కొన్ని గ్రామాలను కలిపి ఒక పెద్ద పంచాయతీగా చేయాలని సంకల్పించారు; విధాన ప్రకటనకూడా చేశారు; తన

### మనలోమాట

పార్టీలో వ్యతిరేకత వచ్చినా తనమాటే సాగాలనే మొండి పట్టుదలతో వుండి వారు; పరిస్థితులు ప్రతికూలం కావడం చూచి, తన పార్టీలోనే తనపట్ల తన విధానాలపట్ల తన నిరంకుశ వైఖరిపట్ల పెరిగి పోతున్న వ్యతిరేకతను అసహనాన్ని గమనించి దిగివచ్చారు; గ్రూపింగులు గ్రూపింగులు లేకుండా యథాతథంగా వెంటనే పంచాయతీలకు ఎన్నికలు జరపడానికే నిర్ణయించారు. అంతేకాదు-పరిస్థితులు పూర్వంవలె తన అధీనంలో వుండివుంటే, పంచాయతీలకుకూడా పార్టీ అభ్యర్థులను నిలిపి చైతన్య రథమెక్కి విజృంభించివుండేవారు. కాని పరిస్థితులు అదుపు తప్పిపోతుండడం పసికట్టి, రాజకీయ పార్టీలకు అతీతంగా ఎన్నికలు జరుపుతున్నట్లు పుదారంగా ప్రకటించారు ముఖ్యమంత్రి! రామారావుగారిలో తల్లక్రిందులుగా వచ్చిన మార్పుకు ఇదొక సంకేతంకాదా?

ఎమ్మెల్యేల వశీకరణకు కొత్తగా అనేక ఆకర్షణీయమైన కార్యక్రమాలు అమలు జరుపబోతున్నారు ముఖ్యమంత్రి. కాంగ్రెస్ ప్రభుత్వం దిగిపోయేనాటికి శాసన సభ్యుని నెలసరివేతనం-అలవెన్సులతో కలసి - వెయ్యి రూపాయలు. అట్లనే సంవత్సరానికి మూడువేల రూపాయల విలువజేసే రైల్వే కూపన్లు, ఆర్.టి.సి. బస్సుల్లో ఉచిత ప్రయాణావ

—కొరవ 6వ పేజీలో

## స్వంతజనానికే జాలి లేదని చంద్రబాబు వ్యథ

(హైదరాబాదు వృత్తాంతం)

తెలుగుదేశంపార్టీ ఎన్నికల కమిటీ కన్వీనరు శ్రీ ఎన్. చంద్రబాబునాయుడు రాజ్యసభకు వెళ్ళే అవకాశాలు బాగా కనిపిస్తున్నాయి. తెలుగుదేశం పార్టీలో వ్యవస్థాగతంగా జరగనున్న మార్పులలో భాగంగా శ్రీ చంద్రబాబునాయుడును రాజ్యసభకు పంపాలన్న ఆలోచనలో ముఖ్యమంత్రి, తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు శ్రీ ఎన్.టి. రామారావు వున్నారు. అయితే అల్లుడు కాబట్టి ఈ విషయంలో జాగ్రత్తగా, నొప్పితెలియకుండా ఆపరేషన్ జరిపే కార్యక్రమంలో శ్రీ రామారావు నిమగ్నమై వున్నారు.

గత జనవరిలోనే ఈ పని పూర్తి కావలసివుంది. అయితే హైకోర్టు తీర్పు రావడం, ముఖ్యమంత్రి రాజీనామా చేయాలని ప్రతిపక్షాలు, ముఖ్యంగా కాంగ్రెసుపార్టీ కోరడంతో తెలుగుదేశం పార్టీ ఎన్నికలు వాయిదా పడ్డాయి. ఇప్పుడు పరిస్థితులు మళ్ళీ కుదుటపడడంతో పార్టీ ఎన్నికలపై శ్రీ రామారావు దృష్టి సారిస్తున్నారు.

—కొరవ 6వ పేజీలో

### ఈశాన్యభారతంలో రాజీవ్ పవనాలు

ఎర్రకోటగా ప్రసిద్ధికెక్కిన త్రిపురను కాంగ్రెస్ కైవసం చేసుకున్నది. ఆనాడు కేరళలో కమ్యూనిస్టుల పతనాన్ని ఇందిరాగాంధీ నిర్దేశిస్తే, ఈనాడు తనయుడు రాజీవ్ త్రిపురను కమ్యూనిస్టు చెరనుంచి తప్పించారు. ఆ రాష్ట్రం ఆవిర్భావం తర్వాత మార్క్సిస్టులకు పరాజయం ఎదురు కావడం ఇదే ప్రథమం.

మేఘాలయలో ప్రభుత్వం ఏర్పాటుకు తగిన ఆధిక్యత సంపాదించలేక పోయినప్పటికీ; అక్కడా కాంగ్రెస్‌పార్టీయే మెజారిటీపార్టీగా ఎన్నిక కాగల్గింది. ఉత్తరభారతంలో రాజీవ్ ప్రాభవం సన్నగిల్లుతున్నదన్న ప్రతిపక్షాలవిమర్శను, ఈశాన్యభారతంలోని రాజీవ్‌పవనాలు తిరగుశే సమాధానమిస్తున్నాయి

## నిస్వార్థ సంఘసేవకుడు, రైతుబాంధవుడు సేతురామన్నకు వీడ్కోలు

నిరాడంబరత, నియమపాలన, నిర్మోహమాటం, నిక్కచ్చితనం, నిస్వార్థత, నిజాయితీ వంటి అత్యుత్తమ మానవ లక్షణాలు మూర్తీభవించిన మూర్తి- నిరుపమాన సంఘసేవకుడు, రైతుల ఆత్మబంధువు, మూడు దశాబ్దాలకు పైగా నెల్లూరులో వుంటూ, నిష్కళంక బ్రహ్మచారిగా, అత్యంత భక్తిశ్రద్ధలతో, అనితరసాధ్యంగా నెల్లూరు సీమను సేవించిన- జగమెరిగిన మంచి మనిషి, అజాతశత్రువు గండవరం సేతురామిరెడ్డి గారు, తమ శేషజీవితాన్ని- హైదరాబాదులోని మేనల్లుని ఇంట గడపడానికి వెళుతున్న గుండెలు పిండే సమయమిది.

ఈ సమయంలో వారు-మూడుసార్లు తమను పురపాలక సంఘ సభ్యునిగా గెలిపించి, తమసేవలందుకున్నవారి ఇంటింటికి వెళ్ళి, వారిని సెలవు కోరుతుండడం తెలిసి, వారి అభిమానుల హృదయాలు- మూగగా రోదిస్తున్న సమయమిది.

సంఘసేవకుడు అంటే-ఇలావుండాలి అని, వర్తమాన, భవిష్యత్ సంఘసేవకులకు చూపించి పాఠాలు చెప్పడానికి- సేతురామిరెడ్డి గారు అతి విశిష్టమైన నమూనా. అటువంటివారు- ఫిబ్రవరి 7 సాయంత్రం నెల్లూరునువిడిచి, వెళ్లిపోతున్నారు. వారి శేషజీవితం- ఆయురారోగ్యాలతో, సుఖశాంతులతో సాగాలని- వారి అభిమానుల కోరిక.

ఆయన సామాన్యుడు; సామాన్యులలో సామాన్యుడు; సామాన్యుడైన అసామాన్యుడు; మాన్యుడు; ధన్యుడు. ఆ ప్రేమమూర్తికి- అశ్రుతప్త హృదయాలతో, ముకుళితహస్తాలతో, నమస్కరిస్తూ వీడ్కోలు చెప్తున్నాం.

"గోడుమని విలపించేరే నీ గుణము తెలిసినవారు
తోడుగ నీతో ఆడి పాడి కూరుములాడినవారు
విరులవే కన్నీరులతో మనసార దీవించేరే
ఎన్నడో తిరిగి ఇటు నీ రాక ఎవరే తెలిసినవారు"



అభిమానులు

# జమీన్ రైతు

## దోపిడీకి లైసెన్సు!

ఇటీవల ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావుగారు చేస్తున్న సవాలక్ష వాగ్దానాలలో ఒక పాత వాగ్దానం. ప్రైవేటు స్కూళ్ళకు ప్రోత్సాహం ఒకటి!

రామారావుగారి బుర్రలో ఏక్షణంలో ఏపురుగు తొలుస్తుందో, ఏనిమిషంలో ఏనిర్ణయం తీసికొంటారో, ఏక్షణంలో ఎవరిమీద కత్తి ఝుళిపిస్తారో, ఏఘడియలో ఎవరిని కరుణిస్తారో ఆ కృష్ణపరమాత్మునికే ఎరుక!

ఎయిడెడ్ పాఠశాలలను ఎప్పుడో రద్దుచేశారు. ఎక్కడో ఒకటి అర మిగిలివుంటే వాటికి ఇస్తుండిన మేనేజిమెంటు గ్రాంటు రామారావుగారు రద్దుజేశారు. ప్రయివేటు ఇంజనీరింగు మెడికల్ కాలేజి కాపిటేషన్‌ఫీజులను రద్దుజేశారు. ప్రభుత్వడాక్టర్లు ప్రయివేటు ప్రాక్టీసు చేయకూడదని కట్టడివిధించారు. ట్యూషన్‌లు చెప్పకుండా అధ్యాపకుల నోరుమూశారు. ఈ విధమైన రద్దులు హద్దుల కార్యక్రమం నిరాఘాటంగా సాగిపోయింది. అప్పుడు ప్రయివేటు విద్యాసంస్థలను, ప్రయివేటు ప్రాక్టీసులను, ట్యూషన్లను ఎందుకు నిషేధించాలి? ఇప్పుడు వ్యక్తిగత విద్యాసంస్థలకు ప్రోత్సాహకాలు ఎందుకు ప్రకటించాలి?-ఆయనకే తెలియాలి!

ప్రస్తుతం ముఖ్యమంత్రి ప్రయివేటు విద్యాసంస్థలకు ఇచ్చిన వరాలలో ఇంజనీరింగు, మెడికల్ కాలేజీలవంటివి చేరవనుకోండి; రేపు వాటినిమాత్రం చేర్చడనే నమ్మకమేముంది? ఇంగ్లీషు మీడియం స్కూళ్ళపేరుతో ప్రయివేటుస్కూళ్ళు సందుకొకటి గొందెకొకటిగా వున్నాయి; అవి సంవత్సర సంవత్సరం ఎక్కువవుతూనేవున్నాయి. అంటే ఇతర వ్యాపారాలవలెనే ఈ ప్రయివేటు స్కూళ్ళుకూడా ఒక లాభసాటి వ్యాపారమార్గమైపోయిందన్నమాట. అందువల్లనే ప్రతి ఒక్కరూ, ప్రతివార్డులో, ప్రతివూళ్లో పెట్టుబడిలేని ఈ వ్యాపారానికి ఎగబడుతున్నారు.

ఈ ప్రయివేటు విద్యాసంస్థలకు-మిషనరీలవి మినహాయిస్తే-భవనవసతి వుండదు, బల్ల-కుర్చీ-బ్లాక్‌బోర్డు వుండవు. ఆటస్థలం వుండదు, విద్యాబోధనా పరికరాలుండవు; ఏమీవుండవు. పాఠశాలలకుగా ప్రత్యేకంగా ఉపాధ్యాయులుండరు; పూటగడవని రిటైరైనవృద్ధులు పార్టుటైం టీచర్లుగా పనిచేస్తుంటారు పిల్లలవద్ద నెలసరిజీతాలుగాక, ప్రవేశరుసుంక్రింద, భవన నిధిక్రింద, హాస్టలు సౌకర్యం పేరుతో వందలు వూడ్చుకుంటారు.

ఎలిమెంటరీస్కూలునుప్రాథమికోన్నత పాఠశాలగా మార్చుకోవాలంటేస్థలము, భవనవసతి వగైరాలెన్నో సమకూర్చమని అడుగుతుందిపంచాయతిమండలం ఒకహైస్కూలునెలకొల్పుకోవాలంటేఐదెకరాలచోటు,భవనవసతి, ఉపాధ్యాయులజీతాలువగైరా అనేకషరతులు విధిస్తుంది జిల్లా ప్రజాపరిషత్తు, జూనియర్‌కాలేజీలు, డిగ్రీ కాలేజీలు కోరడమే ఒకనేరంగావుంటుంది-ప్రభుత్వంవిధించే షరతులు తీర్చడం సుసాధ్యమైన పనికాదు. కాని కనీసం అరగజం ఆటస్థలంకూడా లేకుండా అద్దెకొంపల్లో మ్రగ్గుతున్న ప్రయివేట్ స్కూళ్ళనుమాత్రం ప్రభుత్వం కిక్కురుమనకుండా అనుమతిస్తుంది. పైగా ప్రయివేట్ మేనేజిమెంట్లు షత్రిస్థుల శాతాన్ని ఎక్కువగా రప్పించుకొని, సీట్లకు గిరాకి పెంచుకొని, డబ్బుతో జేబులు నింపుకొంటాయి! మిషనరీ స్కూళ్ల పరిస్థితి కొంతమేలైనా, డబ్బు గుంజడంలోమాత్రం అవికూడా ఏమీ వెనుకబడవు

ఇటువంటి ప్రయివేటు మేనేజిమెంటు స్కూళ్ళకు ముఖ్యమంత్రి ప్రోత్సహిస్తున్నపుడు, వారికి భరోసా ఇస్తున్నపుడు పంచాయతీరాజ్ సంస్థలు, ప్రభుత్వ ఆధ్వర్యంలోవున్న స్కూళ్ళు కాలేజీల మీద కోట్లకు కోట్లు తగలేయడమెందుకు? విద్యారంగాన్ని వ్యక్తులకే వదలి, ప్రభుత్వం చేతులు దులుపుకోకూడదా?

ఏమైనా ప్రయివేటు పాఠశాలల విషయంలో ముఖ్యమంత్రి విధానం తీవ్రంగా ఆక్షేపణీయమైనది ప్రయివేట్ విద్యాసంస్థలు నడుపుకోవడాన్ని ప్రోత్సహించడమేకాక, భవన నిధులు కూడా వసూలుచేసుకోడానికి అనుమతివ్వడం దోపిడీకి లైసెన్సు ఇవ్వడమే అవుతుంది!

# జమీన్ రైతు

4.2.1938

### ఋణ విమోచన చట్టం

రాజాజీ!

ఓ ధీరతకోత నీ రథము
తీవ్రగతిగా ప్రతిపక్షకృష్ణమూ
ర్తులకు ఫాయిలా, కుబేర ధన
సామ్ముదుముఖ్యులుచెట్టినాడుపై,
పేరెముతోడ ఢీకొనిన
పేలటుపై నం కృష్ణరావుపై,
వారక రెడ్డి నాయుడుల
వాక్యముపైనను శాస్త్రిరాటిపై,
ధీరతకోత వేగ నడిపించియు
మా ఋణభార చట్టమీ
తీసుకనైన దెబ్బ ఋణ
తీవ్రత క్రుంగెడిపట్టి రైతునం
సారముల మిగుల్ప కృషి
సల్పిన నీమ్రుదుమాధురీవతో
వీర నుతిస్తుమా! ఋషి
పుంగవు నిత్యపూజార్హ! న్ను మా
వారలు నను తీర్చు ఋణ
భార తరిమ్కృత చిత్తవృత్తి గా

### నార్ల పుస్తకం నిషేధం

నార్ల వెంకటేశ్వరరావుగారు రచించిన "నేటి రష్యా" అను గ్రంథమును నైజాం ప్రభుత్వంవారు నిషేధించిరి.

## 50 ఏళ్ల క్రితం ఈ వారం

### నెల్లూరు ముచ్చట్లు

#### ఉత్తర బోర్డు

ఉత్తరబోర్డు అనునది విషయంలో యమధర్మరాజుకు చిత్రగుప్తునికి తకరారు వచ్చినట్లుంది. ఈ అక్షింతలు ఎవరి నెత్తిన బడతవో?

ఉత్తర సభ్యులు కొందరు పార్టీ శిక్షణకు లొంగకుండా అనర్థంగా ప్రవర్తిస్తున్నారు. తమ శక్తి సామర్థ్యాలవల్ల తాము గెల్చామని అనుకొంటున్నారు కాబోలు! ఎట్టుంటే హిరణ్యకశిపుడి వరాలంటే వాయుదుగారి శతనాని సత్యమూర్తిగారి క్రింద ఐంతిగో పుండే దారా గారి భక్తికి కారణమేమంటారు?

ం ం ం

గోయిందన్నగారూ! ఈ కృతోర కట్టుకోనా గోదావరి ఈదేది? కుటుంబ కలహాలు శాశ్వతంగా ఉంటాయి? అవి కుటుంబ కలహాలుగూడా కావనుకుంటూ: ప్రణయ కలహాలు ఇవెంత సేకయ్యా!

ఇంతకాలం ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలావు. నీ ఆశ్రితులందరూ మంచి వారవనిపించుకున్నారు. అధికారాంతంలో ఎందుకు బాబూ! నీకింత వ్యామోహం?

ఏదో కొంతకాలం అనుభవించావు రాజాధిరాజులమాదిరి అన్నిసుఖాలు. ఈ వృద్ధాప్యంలో అనవసర విశ్వాస రాహిత్యాలెందుకు తెస్తావు?

ఇంతకూ నా కెందుకు.

"అడుగనివానికి హితము అకలి గల్లనివాని కన్నమి చ్చెడు అవివేకులగి".

# నవ్విపోతారయ్యా నల్లపరెడ్డీ!

మొన్న 31 తేది సాయంకాలం ప్రాంతీయ వార్తలలో నల్లపరెడ్డి శ్రీనివాసులరెడ్డి హైకోర్టు తీర్పు ననుసరించి అర్హత కలిగిన మాజీ గ్రామాధికార్లను విలేజి అసిస్టెంటులుగా నియమించాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరారనే వార్త విని ఆశ్చర్యపోయాను తమరు పదవిలో వుండగా అదేవిషయమై కోర్టు తీర్పులిచ్చినప్పుడు మీరేమిచేశారు? అప్పటి ప్రేమ ఏమైపోయింది? ఆరోజు గ్రామాధికారుల స్థితిపట్ల మీకెందుకు జాలికలగలేదు. నాడె ధ్వనిలె మౌనంగావున్నా కొంత గౌరవంగా వుండేది. ఇటువంటి ప్రకటనలు చేస్తే వింటున్న నవ్విపోతారయ్యా నల్లపరెడ్డీ!

వాకిలి -సుందరబాలయ్య.

### ఆస్పత్రులగుట్టు రట్టుచెయ్యండి

అమధ్య మీపత్రికలో నెల్లూరు పెద్దాసుపత్రి విషయాలు బట్టబయలు చేసినందుకు సంతోషమైంది ఇతర ఆసుపత్రుల కీర్తి కూడా కొనసాగించాలని నా మనవి.

నెల్లూరు ఎస్.వి.ఎస్ రావు

### నిడిముసలి సొసైటీ-అప్పులలో నిజాయితీ

సాధారణంగా సహకార సంఘాధ్యక్షులు, అప్పుల పంపిణీలో పర్షకక్షలు, పార్టీ తరతమ భేదాలననుసరించి పోతుంటారు. కానీ మా నిడిముసలి సొసైటి ఈ విషయంలో ఎంతో ఆదర్శంగా వ్యవహరించింది. నాలుగు గ్రామాలలో రెండు వర్గాలకు సమానంగా అప్పులు పంచడం ద్వారా, అందరి అభిమానానికి పాత్రమైంది సహకార సంస్థలూ గ్రామాలకు సేవ చేయగలవని నిరూపించిన అధ్యక్షుడు శ్రీ చిరంజీవి సంజీవరెడ్డికి మా అభినందనలు

-ఎం సుబ్బరామరెడ్డి,

లేబూరు కె బాలకృష్ణారెడ్డి

### కలెక్టర్ వస్త్రధారణ

నెల్లూరు జిల్లా కలెక్టర్ శ్రీ ప్రశాంత మహాపాత్ర రిపబ్లిక్ దినోత్సవంలో యూత్‌కాంగ్రెస్ మార్కు వస్త్రధారణ చేసుకుని రావడాన్ని పేపర్ ప్రత్యేకంగా ప్రస్తావించడం అనవసరం. తెల్లపైజమా, జుబ్బా యూత్‌కాంగ్రెస్ వారులకంటే ముందు సోషలిస్టు మార్కు వస్త్రధారణ రాజ్యాలు. రాజరికాలు పోయి ప్రజాస్వామ్యం వర్ధిల్లుతున్న సమ

## జనవాణి

యంలో అధికారులు రాజులనాటి ఫర్మానాలను పాటించవలసిన అగత్యమేముంది అధికారిక ఉత్సవాలలో 'సెరిమోనియల్ డ్రస్' ధరించాలన్నది బ్రిటిషువారి సాంప్రదాయం. మనమిప్పుడు వారి బానిసలం కాము; పైపెచ్చు ప్రజలలో కలిసిపోయేరీతిలో అధికారుల వస్త్రధారణ వుండడం మంచిదేకదా!

గూడూరు -ఎం. మధుసూదనరావు

### స్కాలర్ షిప్పులు విడుదల చేయాలి

విద్యాసంవత్సరం పూర్తి కావస్తున్నా ఇంతవరకు విద్యార్థులకు స్కాలర్ షిప్పులు విడుదల చేయలేదు జిల్లాను కరువు ప్రాంతంగా ప్రకటించినా ఇంకా ఫీజులు రద్దు చేయలేదు ఈ రెండు పనులు వెంటనే అమలు చేయాలని కోరుతున్నాము

-ఎస్. కె. చాంద్‌భాషా,

కావలి కె. వి. రమణయ్య

### నెల్లూరు టౌనులో వేకువ చోరీలు

ఇటీవల నెల్లూరు పట్టణంలో కొత్త తరహా దొంగతనాలు ప్రారంభమైనాయి.

—కొరవ 10 వ పేజీలో

# వ్యాపారులపాలిట యమదూతగా తయారౌతున్న వాణిజ్యపన్నులశాఖ!

కమర్షియల్ ట్యాక్సెస్‌లో ఉద్యోగమంటే కల్పవృక్షం లాంటిదని సామెత. ఉద్యోగి తరుపున దరఖాస్తు చేసిన వెంటనే అధికారులు అంటే, కరెన్సీ ప్రెస్‌కే యజమానులన్నట్లు. వ్యాపారులను స్పెషల్‌గా అర్థం చేసుకుని దిగుమతి చేసుకున్న ఎలక్ట్రిక్ కరెన్సీ ప్రింటర్ అయినా ఒకరోజు కాకపోతే ఒకరోజు చెడి మూలపడుతుందేమోగాని, కమర్షియల్ ట్యాక్సెస్ ఉద్యోగులకు కరెన్సీ లేని రోజంటూ వుండదని ప్రతీతి.

అతిశయోక్తికోసం చెప్తున్న మాటలు కావివి; అక్షరసత్యాలు. ఈ మధ్య నే నెల్లూరులో పనిచేసివెళ్ళిన ఒక కమర్షియల్ టాక్స్ అధికారి ఇళ్ళపై ఎసిబి దాడులు చేస్తే కొన్నిలక్షల రూపాయల విలువైన అక్రమార్జన బయటపడిందట. ఈశాఖలో ఉద్యోగస్థులు తమ ఉద్యోగ శైలిని ఎలా గుట్టలుగా వుపయోగపడు తున్నాయో తెలుసుకోవడానికి ఇంతకంటే నిదర్శనం ఏమికావాలి?

వాణిజ్యపన్నుల శాఖ దాని ఉద్యోగులకు బంగారుగని అయిందిలే. దాని అధికార పరిధిలోకి వచ్చే వ్యాపారులందరూ దీనికి తెలుసునని మాకింత ప్రత్యేకంగా చెప్పనవసరంలేదుకదా! ఇతర జిల్లాల పరిస్థితి ఏమిటో మాకు తెలియదుగాని నెల్లూరు జిల్లాలో మాత్రం వ్యాపారులు కమర్షియల్ ట్యాక్సెస్

అంశంపై ఒక సర్వే నిర్వహించడం వి శ్రుత మంగా వాణిజ్యపన్నుల శాఖను ఎన్నుకున్నాము. నిజానికి మేము తల పెట్టినంత విస్తృతమైన సర్వేలో పాతిక వంతుకూడా పూర్తి కాలేదు. అనుకున్న వర్గాలవారినందరినీ ఇంకా కలవనేలేదు. అధికారుల వైపునుంచి సమాచారం రాబట్టనేలేదు. కాకతాళీయంగా కలిసిన

## ప్రభుత్వశాఖల పనితీరు-1

ఉద్యోగులను చూస్తే, వరకట్నపు దూతలను చూసినంత భయపడి పోతున్నారు. వారి దృష్టి తమపైకి ప్రసరించకూడదని వేయి దేవుళ్ళకు మొక్కుకుంటున్నారు. వారు వారిట్లో అడుగుపెడితే తమపని ఖతమైపోయినట్లే భావిస్తున్నారు.

వివిధ ప్రభుత్వ శాఖలు తమతమ పరిధులలో వినియోగదారులు విషయంలో ఎట్లా ప్రవర్తిస్తున్నాయి అనే

నలుగురైదుగురు వ్యాపారస్తులతో ఈ పన్నులశాఖ విషయం ప్రస్తావించాం, అంతే; వారి కష్టాలకథలు వెల్లువగా వెలికి వచ్చాయి. మనసులో దాగిన ఆక్రోశం ప్రవాహంలాగా బయటకు దూకింది. వారు చెప్పినదాంట్లో 10 శాతం నిజం వుండినా, వాణిజ్యపన్నులశాఖ వ్యాపారుల పాలిట యమదూతగా తయారైందని తీర్మానించేయవచ్చు.

నెల్లూరులో వాణిజ్య పన్నులశాఖ డిప్యూటీ కమీషనర్ కార్యాలయం వుంది. ఆయన పర్యవేక్షణలో ఇద్దరు సిటిఒలు, ఇద్దరు డిసిటిఒలు తక్కుంగల సిబ్బంది పనిచేస్తున్నారు. ఇంటెలిజెన్స్ స్క్వాడ్ పేరుతో ఒక విభాగం పనిచేస్తూంది. ఈమధ్యనే ఎన్‌ఫోర్స్‌మెంట్ విభాగం ఇంకొకటి, ఒక డి ఎస్ పి స్థాయి కల్గిన అధికారి పర్యవేక్షణ క్రింద ప్రారంభించారట.

జిల్లాలో దాదాపు 12 వేల మంది వ్యాపారులు సేల్స్ ట్యాక్స్ లైసెన్సులు పొందివున్నారని అంచనా. వీరిలో నెలకు నాలుగైదులక్షల పన్ను కట్టే సిపోర్స్ వంటి భారీ వ్యాపారసంస్థలున్నాయి; నెలకు నాలుగైదువందలకు మించి కట్టలేని బలహీన వ్యాపారులూ వున్నారు. వీరందరినుంచి జిల్లాలో సంవత్సరానికి దాదాపు 68 కోట్ల రూపాయల పన్ను వసూలౌతున్నదట. ఇది నిత్యం పెరిగే పద్దేకాని, తగ్గేదికాదు.

వినడానికి కఠోరంగా వినిపించినా, 68 కోట్లు ప్రభుత్వ ఖజానాకు జమ అయినప్పుడు అధమ పక్షం మూడు నాలుగు కోట్లయినా వివిధ స్థాయిల్లో సిబ్బంది జేబుల్లో పడకుండా వుంటుందా?

ప్రభుత్వ ఖజానాకు అధికారికంగా, ప్రభుత్వ సిబ్బందికి అనధికారికంగా కోట్లలో పన్నులు చెల్లిస్తున్న వ్యాపారులను ప్రభుత్వం ఎట్లా చూడాలి? ఎంత గౌరవించాలి? కానీ జరుగుతున్నదేమిటి?

వ్యాపారస్తుడు, ప్రతి కొత్త వ్యాపార ప్రారంభ సమయంలో విధిగా సేల్స్ ట్యాక్స్ రిజిస్ట్రేషన్ చేయాలి. పీడింపు సోపానికి ముఖద్వారం ఈ రిజిస్ట్రేషన్. నిబంధనల ప్రకారం ప్రభుత్వానికి వంద రూపాయల చలానా కట్టి, వ్యాపార పత్రాలు, సమాచారం సమర్పించాలి. కానీ అధికారులు రిజిస్ట్రేషన్ చేసే వ్యాపారి ఆస్తిపాస్తుల వివరాలు, శిస్తు రసీదులు, సాల్వెన్సీ సర్టిఫికేట్లు వంటి అదనపు సమాచారంకూడా అడుగుతారు.

—కొరవ 8వ పేజీలో

# చిన్నపిల్లలకు కమ్మని కథలు వినిపించే పుస్తకం

భారతీయ సంస్కృతికి మూలాధారా

## గ్రంథసమీక్ష

బాల కథాలహరి

రచన:

జి సురేందర్ ఎం ఎ., బి ఇడి.

ఉపాధ్యాయుడు

పాలెం, 509215

మహబూబ్‌నగర్ జిల్లా

వెల - 10 రూపాయలు

సమీక్షకుడు:

సురభి నరసింహం

లైన వేదాలు పురాణాలు, భారత, భాగవత రామాయణాలలోని ప్రముఖవ్యక్తుల జీవిత విశేషాలను, కథాకథన పద్ధతిలో వ్రాయబడిన గ్రంథం బాలకథాలహరి. రచయిత ఉపాధ్యాయుడు; చిన్నపిల్లలకు ఏ విధంగా కథచెప్తే ఆనందిస్తారో ఆ విధంగా 'నేటి బాలబాలికలే రేపటి పౌరులు' అనే లక్ష్యంతో ఉత్తమవ్యక్తుల జీవితసత్యాలను సులభంగా, సుందరంగా యీ గ్రంథాన్ని రూపొందించారు. బాల సాహిత్యం మనకింకా తగినంతగా పెంపొందలేదనే అపవాదును రచయిత తొలగించారు. ప్రాచీన సాహిత్యంలోని ప్రముఖుల జీవితవిశేషాలను సంక్షిప్తంగా బాలురస్థాయిని గుర్తించి, సులభశైలిలో ఎదుట వ్యక్తి వుండి కథచెప్పినరీతిగా ఇందు 25 మందిని గూర్చిన కథలున్నాయి. "పిల్లలూ! మీకీకథ తెలుసా?

—కొరవ 9వ పేజీలో



# అంతరిక్ష శాస్త్రంలో అనేక విజయాలు

'సొసైటీ ఆఫ్ సైన్స్ ఫర్ ది పీపుల్' మొన్న 24 తేది శుక్రవారం పద్మావతి మహిళా గ్రంథాలయంలో ప్రొఫెసర్ వై నాయుడమ్మ స్మృతికు స్మారకోపన్యాసం నిర్వహించింది. పార్ ప్రాజెక్టు సలహాదారు శ్రీ పి డి మజుందార్ శాస్త్రవిజ్ఞానానికి సంబంధించిన అనేక అంశాలతో సుదీర్ఘ ఉపన్యాసమిచ్చి సభికుల మెదళ్ళకు పదును పెట్టారు. అంతరిక్ష పరిశోధన హెచ్చు సాంకేతిక విజ్ఞానానికి సంబంధించినా, సగటు మనిషికి దైనందిన జీవితంలో కమ్యూనికేషన్సు, తదితర రూపాలలో ఎంతో విస్తృతంగా ఉపయోగపడుతూందని అయన్నారు. అమెరికా, రష్యాలు అంతరిక్ష పరిశోధనలో చేస్తున్న ఖర్చుతో పోలిస్తే, మన దేశం చాలా తక్కువ వెచ్చిస్తూ, దని, అయినా మన శాస్త్రవేత్త ఇప్పటివరకూ అనేక ఘనవిజయాలు సాధించారు.

అధ్యక్షించిన శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం భౌతికశాస్త్ర ఆచార్యుడు డాక్టర్ ఎన్ వి జె లక్ష్మణ్ సొసైటీ అధ్యక్షుడు ప్రత్యక్షమాయ ఆధునాతన దశలో అంతర్జాతీయ గుర్తింపుపొందిన శాస్త్రవేత్త డాక్టర్ ఎ జగదీష్ ప్రసంగించారు. నాయుడమ్మ కుమారుడు శ్రీ రమేష్ సొసైటీ తరఫున శ్రీ మజుందార్‌కు మెమెంటో బహూకరించారు. సొసైటీ కోశాధికారి డాక్టర్ ఎ సోమశేఖర్ స్వాగతించగా కార్యదర్శి శ్రీ పి ఎ. లావణ్య రావు వందనాలు చెల్లించారు.

## నెల్లూరు సంగతులు

### వైజ్ఞానికదినం

సర్ సి. వి. రామన్‌కు నోబెల్ బహుమతి వచ్చినరోజు జాతీయ వైజ్ఞానికదినం అంటే ఫిబ్రవరి 28 తేదీన సొసైటీ ఆఫ్ సైన్స్ ఫర్ ది పీపుల్ ఒక సమావేశాన్ని

—కొరవ 8వ పేజీ

# పెళ్ళిళ్లు

### 'విశాలాంధ్ర' వివాహం

'విశాలాంధ్ర' దినపత్రిక నెల్లూరు విలేఖరి, కోరగలిగిన జర్నలిస్టు కామ్రేడ్ కె వి రమణయ్య తనయ సీతాలక్ష్మి (ఎం కాం); బుట్టాయగూడెం ఎం. డి ఓ. శ్రీ డి వి. ఎస్. ఆర్. కృష్ణమూర్తి తనయుడు విశ్వనాథనూర్ల వివాహం జనవరి 30 తేది నెల్లూరు అన్నదాన సమాజంలో జరిగింది.

### తురిమెర్ల పెండ్లి

సైదాపురం మండలం తురిమెర్ల పెద్ద శ్రీ మేడికొండ తంగయ్యనాయుడు కుమారుడు; ఎందుకో ఎవరిమీదనో అలిగి ఇపుడా మొన్న ఒకసారితప్ప ఎప్పుడూ కాంగ్రెస్‌ను సేవించే, కాంగ్రెస్ అభ్యర్థుల విజయానికి కృషిచేసే విశాఖపట్నం కంట్రాక్టరు శ్రీ వెంకయ్యనాయుడు తమ్ముడు శ్రీనివాసులు; కనుపూరు, శ్రీ ఉప్పుటపాటి బలరామనాయుడు కుమార్తె అన్నపూర్ణ పరిణయం 29 తేది వరునింట జరిగింది.

### డాక్టర్ వివాహం

విమల్ సిల్క్‌హౌస్ - రూప్‌సాగర్ - మనోరాణి - విమల్ జంట్స్ పేర్లతో నెల్లూరు వస్త్ర వ్యాపారాన్ని కబళించిన సంస్కారశీలురు, ఐక్యతలో ఆదర్శప్రాయులు అయిన అన్నదమ్ముల సోదరుల్లో ఐదవవారు, నెల్లూరు జ ఎస్ ఐ ఆస్పత్రి డాక్టరు శ్రీ కృష్ణమూర్తి ఎం. బి., బి ఎస్., అనకాపల్లి- కుంచం కృష్ణ అన్న అప్పారావు కుమార్తె డాక్టర్ పరమేశ్వరి ఎం. బి., బి. ఎస్ కళ్యాణం 29 తేది అనకాపల్లిలో వధువు ఇంట జరిగింది.

ఈ సందర్భంలో వధువు పక్షంవారు 31తేది నెల్లూరులో 'రిసెప్షన్' ఇచ్చారు.

### సూళ్ళూరుపేట వివాహం

సూళ్ళూరుపేట వైశ్య ప్రముఖుడు శ్రీ బత్తా సుందరరాజా కుమారుడు సురేష్; తిరుత్తని, శ్రీ ఎం. సత్యనారాయణశెట్టి కుమార్తె విజయలక్ష్మి వివాహం 22తేది తిరుత్తని - శ్రీ సుబ్రహ్మణ్యం కల్యాణ మండపంలో జరిగింది.

### డి. పి. ఆర్. ఒ. కుమారుడు

నెల్లూరు జిల్లా పౌర సంబంధశాఖాధికారి శ్రీ వై వి రత్నం కుమారుడు వెంకటరమణమూర్తి బి టెక్, కర్నూలు జిల్లా బనగానపల్లి-పశుసంవర్ధకశాఖ అసిస్టెంటు డైరెక్టరు శ్రీ ఒ. శ్రీమన్నారాయణ కుమార్తె రాజశ్రీ బి కాం పెండ్లి 24 తేది బనగానపల్లెలో జరిగింది.

శ్రీ వెంకటరత్నం 31 తేది నెల్లూరులో ఉపాహారవిందు చేశారు.

### మద్రాసు వివాహం

రైల్వే ఉద్యోగిగా మద్రాసులో వున్న నెల్లూరీయుడు జమీన్‌రైతు అభిమాన పాఠ

—కొరవ 9వ పేజీలో

# షూటింగ్లు ఏర్పాటు చేయడంకూడా దర్శకుడి బాధ్యతేనా?

"ఒక చిత్రాన్ని చక్కగా మలచడం కోసేకాదు; ఆర్టిస్టులంతేకాల్షీట్లు ఫిక్స్ చేయించి షూటింగ్ లకి పెట్టుకున్న షూటింగ్ లకు వాళ్ళు హాజరయ్యేలా చేయగల్గిన నేర్పరే గొప్ప డైరెక్టర్ అని భావిస్తున్నారు కొందరు చిత్రనిర్మాతలు. అలా షూటింగ్లు సక్రమంగా జరిగిపోయేలా చూసుకునేవారినే డైరెక్టర్లుగా బుక్ చేసుకుంటున్నారు. ఇలాంటిస్థితిలో డైరెక్టరుకు ఉన్న విలువేమిటి?" అని ఇటీవల వాపోయారు డైరెక్టర్ కె. మురళీ మోహనరావు. ఆయన చెప్పినదాంట్లో అసత్యమేమీలేదు. నిర్మాతలు సక్రమంగా పారితోషికం చెల్లించకపోయినా ఆర్టిస్టులను, సాంకేతిక నిపుణులను సమీకరించ గల్గితేనే దర్శకునికి [illegible] లైనా ముంచిరిలేదు" అనే [illegible] వ్యక్తం చేశారు.

### హీరోయిన్లుగా తారల మనుమరాళ్ళు

అలనాటినటి, నిర్మాత కృష్ణవేణి తన మనుమరాలు శిరీషను సినిమాతారగా చేసేసరికి షావుకారు జానకికూడా తన మనుమరాలిని హీరోయిన్ గా చేయడానికి ప్రయత్నాలు చేస్తోంది.

### మద్రాసు సినిమా వార్తలు

సురేష్ ప్రొడక్షన్స్ లాంటి సంస్థలలో ఇలాంటి బాధ ఉండదు. కొందరు కొత్త నిర్మాతలు అనుకున్నదానికన్నా ఎక్కువగా ఖర్చు పెట్టేసి డీలా అయిపోయి నప్పుడు షూటింగ్లు సజావుగా సాగేలా చూసుకునే ఖర్మకూడా దర్శకుల నెత్తిన పడడం కడు శోచనీయమైన విషయం.

### అసిస్టెంట్ డైరెక్టర్ అత్యాచారం

కృష్ణ అనే సహాయ దర్శకుడు ఒక నటి ఇంట్లోని పనిమనిషిని ఎవ్వరూలేని సమయంలో బలాత్కారంగా మానభంగం చేశాడు. ఆ పదిహేనేళ్ళ అమ్మాయి అన్నత్రికి ఆ సహాయ దర్శకుడు జైలుకి వెళ్ళాడు.

### ఫిల్మోత్సవ్ కు తెలుగు సినిమావారు

మద్రాసు నుంచి [illegible] రచయితలు, దర్శకులు జనవరి 10 నుంచి 24 వరకు జరిగిన ఫిల్మోత్సవ్ లో ప్రదర్శించే సినిమాలు చూడడానికి తిరువనంతపురం వెళ్ళివచ్చారు. ఎవర్నడిగినా "చూడడానికి కొన్ని సినిమాలు బాగానే ఉన్నాయిగాని, కాపీ కొట్టడానికి ఒక్క

## కారు మోజుతో చెరపాలైన తెలుగుతార

పలు తెలుగు, తమిళ చిత్రాలలో నటించిన సుగంధి అనే ఇరవై ఏళ్ల నటి ఎం టి ఎఫ్ 4919 నెంబర్ గల తన అంబాసిడర్ కారుమీద నరేంద్రకుమార్ అనే మార్వాడీసేఠ్ పాతికవేలు రూపాయలు అప్పుతీసుకుంది. అతనికితెలీకుండా తర్వాత ఆకారును ముత్తు అనేఅతనికి అమ్మేసింది. ఈవిషయంతెలిసి, ఆమెపై పోలీసులకు ఫిర్యాదు చేశారు నరేంద్ర కుమార్. ఇప్పుడా నటి కృష్ణ జన్మస్థానంలో ఉంది. ★

# కష్టాలు తీర్చమంటే ఖర్చు తగ్గించమని ఎన్టీఆర్ ఉచిత సలహా!

ఇటీవల మద్రాసు నుండి భారీ చిత్ర నిర్మాతలు ఒకే విమానంలో హైదరాబాదుకు తరలివెళ్ళి ముఖ్యమంత్రిని కలుసుకుని ఒక వినతిపత్రాన్ని సమర్పించారు. ఆ పదకొండు పేజీల వినతిపత్రంలో ఉన్నది ఒకేవిషయం- శ్లాబ్ పద్ధతి రద్దుచేయకూడదని. తక్కువ సమయంలో నిర్మాతకు ఎక్కువ ఆదాయంవచ్చే ఈ పద్ధతివల్ల తారలు, సాంకేతిక నిపుణులు కూడా బాగా సంపాదించగలిగారు గనుక దీనిని కొనసాగించాలని కోరుతున్నారు. కాని, ఈ శ్లాబ్ విధానాన్ని రద్దుచేయాలని తక్కువ బడ్జెట్ లో చిత్రాలు రూపొందించే కొందరు నిర్మాతలు మొరపెట్టుకున్నారు. కొంతమంది ప్రదర్శనశాలల యజమానులుకూడా ఈ శ్లాబ్ విధానంవల్ల తామెంతో నష్టపోతున్నట్లు అంతకు ముందు విజ్ఞప్తి చేశారు. ముఖ్యమంత్రికి ఏంచెప్పాలో తోచలేదు. అసలే ఆయన ఎన్నోసమస్యలతో ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నారు. అందులో ఈ శ్లాబ్ సమస్య ఏపాటిది? అంచేత, ఆయన లౌక్యంగా "మీ సమస్యలను సానుభూతితో పరిశీలించి, తగువిధంగా పరిష్కారం చేస్తాను. కాని, ఇటీవల చిత్ర నిర్మాణ వ్యయం విపరీతంగా పెరిగిపోయింది. ఆ వ్యయాన్ని అదుపులో పెట్టడానికి ఎంతో ప్లానింగ్ వుండాలి. మీరంతా ముందు దుబారాఖర్చులను తగ్గించుకోడానికి ప్రయత్నించండి," అని సలహాయిచ్చి పంపేశారట.

"ఖర్చులు తగ్గించుకొని, తక్కువ బడ్జెట్ లో చిత్రాలు తీసేవారికి శ్లాబ్ సిస్టం ఏవిధంగా ఉపకరిస్తుంది మరి? ముఖ్యమంత్రిగారు గోడమీది పిల్లివాటంలా భలే సలహాఇచ్చారు [illegible]. ఈవినతిపత్రం సమర్పించడానికి మీరంతా విమానంలో రావడం ఎందుకు, రైలులో రావచ్చుగదా అని సలహాయివ్వారు కాదు," అని ఆ నిర్మాతలలో కొందరు

**పెద్ద నిర్మాతలు శ్లాబ్ సిస్టం రద్దు చేయవద్దంటే, చిన్న నిర్మాతలు రద్దుకు మొరపెట్టుకుంటున్నారు!**

విమానంలో తిరుగుప్రయాణంలో మాట్లాడుకున్నారట.

"చలనచిత్రరంగం కష్టసుఖాలు తెలిసినవ్యక్తి ఎన్. టి. ఆర్. ఈయన నిర్మాతగా వున్నప్పుడెప్పుడూ ఇతర నటీనటులకు ఎక్కువ పారితోషికం చెల్లించలేదు, అనవసరంగా ఎక్కువ ఖర్చులు చేయలేదు. ఎంత అనుభవమున్న మనిషైనా ఈయనకేంతెలుస్తుంది ఇప్పటి నిర్మాతల పరిస్థితి?" అని వ్యాఖ్యానించిన వారుకూడా వున్నారట. ★



"అంతిమ తీర్పు"లో ఊర్వశి, సుమలత, సురేష్ గోపీ.

# బాలకృష్ణ నిర్మాతలు భయపడుతున్నారు!

బాలకృష్ణ నటించిన "ఇన్ స్పెక్టర్ ప్రతాప్" ప్రేక్షకుల ఆదరణను నోచుకోలేకపోయింది అయినా సత్యర్థులు కృష్ణ, రమేష్ నటించిన "కలియుగ కర్ణుడు" హిట్ చిత్రం కిందే లెక్క! చాలాకాలం తర్వాత శోభన్ బాబు నటించిన 'సంసారం' ప్రేక్షకులను విపరీతంగా ఆకర్షిస్తోంది. వెంకటేశ్ నటించిన "రక్తతిలకం" కూడా విజయవంతమైంది. పాపం, జయప్రద తన సోదరులు శ్రీరాంకుమార్, రాజబాబు లను నటులనుచేయాలని తలపెట్టిన "రాకీ" చిత్రం గొప్ప ఫ్లాప్ అయింది. చిరంజీవి నటించిన "మంచిదొంగ" కొన్ని ప్రాంతాలలో బాగా ఆడుతున్నా, మరికొన్ని ప్రాంతాలలో ఆశించినంత విజయవంతం కాలేదు. ఈ దెబ్బతో మరికొందరు కొనుగోలుదారులు [illegible] పడిపోయారు.

నిర్మాతలకు ఏం చేయడానికీ తోచడం లేదు. కొందరు ఏదో విధంగా సినిమాలు తీయకుండా ఉండలేకపోతున్నారు. తీసిన సినిమాలు బయటపడే మార్గం తోచడంలేదు మరికొందరు నిర్మాతలకు.

చాలాకాలం తర్వాత శోభన్ బాబు నటించిన "సంసారం" హిట్ అయ్యేసరికి సగంలో ఆగిపోయిన ఆయన చిత్రాలను త్వరగా పూర్తిచేయడానికి హడావిడి పడుతున్నారు నిర్మాతలు. కృష్ణకు, రమేష్ కు మార్కెట్ ఉంటనే ఉంది గనుక వాళ్ళకు ఢోకాలేదు ఎటొచ్చీ బాలకృష్ణతో చిత్రాలు తీసే నిర్మాతలకే గుండెదడ పట్టుకుంది.

# పినాకినీతీరం

(1వ పేజీ తరువాయి)

ఇర్క్యాలెక పార్టీ ఎనుకుంటాంటూ ఒకసి ప్రతిసి టియేయ కవచ్చునుకాని. [illegible] ఐటువంటి లాటి వేయడం విలు వైన టటుసు వంతగ చేసుకోవడంకాదా? అధికారి కి. కౌన్సిలర్లు సేవత్స రాష్ట్రంలో తిరగగలాలి, ప్రజలను కలుసుకోగలాలి. వారి సమస్యలేవైనా వుంటే తెలిసికొని తమవంతిలో చేయతగి నవి చేయగలాలి. ఇటువంటి కౌన్సిలర్లు వున్న వార్డు ప్రజలు గర్వపడవచ్చు; ఐనుంట గినా ఐరస్క పోయినా సంతోష పడవచ్చు.

ఇది ప్రస్తావన సమయంలో నా ఇల్లు (చెవిస్మారకలిని) వార్డువున్న కౌన్సిలరు నా కోసం రెండుమూడుసార్లు తిరిగి పోయారని చెప్పారు; నాకోసమేకాదు, ఆ వార్డులో ఆతను ప్రతిఒక్కరికి కలలో నాలుగా మెలిగేట్లు వున్నారు కొన్ని ఛర్లలో వాళ్ళు వున్నారు. వీళ్ళు వున్నారు అని చెప్పాసికే ఇది ఉదహరించవలసివచ్చింది

ప్రతి కౌన్సిలరు అడిగిన పని అధికార్లు చేస్తారని చెప్పలేము; ప్రతిపనికి నిధులు లభ్యమవుతాయనికూడా చెప్పలేము, మునిసిపల్ పాలన రాజకీయాలకు అతీతంగా, వ్యక్తిగత అభిమాన దురభిమానాల కతీతంగా జరగుతుందని సైతం భావించలేము కాని సేవా భావమనేది వుంటే వీటన్నిటిని అధిగమించి చిన్న చిన్న పనులైనా చేసి ప్రజల మెప్పును పొందవచ్చు. మురికికాల్వలు శుభ్రం చేస్తున్నారా లేదా; చెత్తాచెదారం ఎత్తుతున్నారా లేదా; కొళాయిలకు నీళ్ళు వస్తున్నాయా లేదా; లైట్లు వెలుగుతున్నాయా లేదా; వీధులు నడవడానికి యోగ్యంగా వున్నాయా లేదా; దోమలు, పందులు, మురికిగుంటలతో ప్రజలు ఎంతగా బాధపడుతున్నారు; పబ్లిక్ రోడ్డును కొందరు తమ స్వంత ప్రదేశంగా వుపయోగించుకొని ప్రజలను ఎంత ఇబ్బంది పెడుతున్నారు.... ఇటువంటి చిన్నచిన్న విషయాలైనా కౌన్సిలర్లు చూచి, తెలిసికొని నివారణకు ప్రయత్నించగలిగితే ఎంత బాగుంటుంది? ఇంకా గుండెగలిగిన కొందరు కౌన్సిలర్లైతే మునిసిపల్ పనులలో కాంట్రాక్టర్లుగాని, అధికార్లుగాని నిధులను దిగమింగుకుంటే వాటిని బైటపెట్టగలిగితే ఎంత బాగుంటుంది?

ఏ. ఆర్. కాలేజి టవర్ వద్ద రోడ్డు గతుకులుకాదు, అరడుగులోతు గుంటలే పడిపోయింది. దక్షిణంగాసాగే ట్రాఫిక్ అంతా ఆ రోడ్డు గుండానే పోవాలి. మొన్నటివరకు ఆ గుంటలసంగతి పట్టించుకున్నవాడేలేడు. వారంరోజులక్రితం కంకర, ఎర్రమట్టిపోసి టవర్‌వద్దవున్న గుంటలుమాత్రం పూడ్చారు. మద్రాసు బస్టాండువరకు ఆరోడ్డురోడ్డు గుంటలే ఆ కంకర, ఆ ఎర్రమట్టి వాటిమొహాన కొట్టి ఆగుంటలనుకూడా ఎందుకు పూడ్చకూడదు? అది నేషనల్ హైవేస్‌రోడ్డు కాదనుకుంటాప. ఒకవేళ అది మునిసిపల్ రోడ్డు కాదనే అనుకుందాం; ఆవార్డు కౌన్సిలరు ఎవరో నేషనల్ హైవేస్ వారినిగాని, రోడ్లు భవనాలశాఖవారిని గాని అడిగితే తక్కిన గుంటలుకూడా పూడ్చరుండరా? ఈరోడ్డులే ఇదొక్కటే కాదు; అన్నీ అట్లనేవున్నాయి. ఓట్లరోజు ప్రజలకిచ్చినవుంటే శ్రద్ధాభక్తులు కౌన్సిలర్లకు కర్తవ్యకవుటేగదా!

వ్యక్తులను ఆక్షేపించడం, ఆరోపించడం, అభియోగించడం నా ఉద్దేశ్యం కాదు మున్సిపల్ కౌన్సిలర్లకు ప్రజాసేవా స్పృహ వుండాలనేదే నా కోర్కె. పవిత్ర పినాకినీతీరాన వెలసినమనది ఏ.సి. సుబ్బారెడ్డివంటి పెద్దల పాలనలో కీర్తి గన్ననగరంమనది. ఆపవిత్రత, ఆకీర్తిశిఖల కాలం నిలవాలని కోరకునేవాళ్ళ నేను!

NDP

# జిల్లా రాజకీయాలు

(2వ పేజీ తరువాయి)

పోయినరోజల్లా శీనయ్యపైకిట్లకందాంగం విప్పమని ఎన్టీఆర్ అడిగాడట; కానీ వంటికి నూనెరాసుకునితిరిగే నారసింహా రెడ్డిగారు అంతసులభంగా దొరుకుతారా? తిట్టడం నావల్లకాదు; మిమ్మల్ని పొగడమంటారా చెప్పండి, నా తడాఖా చూపిస్తాను అని బదులిచ్చి వచ్చేశాడట.

జిల్లాలో తిరిగే బాధ్యతతోపాటు, జిల్లాకువచ్చే మంత్రులకు స్వాగతసత్కారాదుల బాధ్యతకూడా తానే స్వీకరించి వస్తున్నారు. కోడెల శివప్రసాద్, దగ్గుపాటి వెంకటేశ్వరరావు ఇరువురికి ఆయనే ఆతిథ్యం నెరపుతున్నారు.

శీనయ్యపై నారసింహయ్యను సంధించడానికి తెలుగునాయకులు చేస్తున్న ప్రయత్నాలు బాగానేవున్నాయి కాని; అసలు వీరిద్దరి మధ్య సంబంధాల సంగతి ఏమిటన్నదే ఇప్పుడు సమస్య? నారసింహారెడ్డి ఈక్షణంవరకు తెలుగుదేశం పార్టీకి రాజీనామా చేయలేదు అది వాస్తవం. అయితే శీనయ్యతో ఆయనకు సంబంధం తీరని మాత్రం ఎవరూ ఖచ్చితంగా చెప్పలేరు. శీనయ్య సభలకు ఆయన హాజరు కాకపోవచ్చు కాని ఆయన సన్నిహితులైనవారు పోతూ వస్తూనేవున్నారు. ఇంకొకప్రక్క శీనయ్య సేన కార్యకర్తలు, నాయకులు ఇప్పటికీ దేగాదాటి దివాణంలో కన్పిస్తూనే వున్నారు. చంద్రమోహన్‌రెడ్డి వంటి అతి ముఖ్యులు 'నారసింహన్న' కి చెప్పకుండా పొదలకూరు ప్రాంతంలో ఏ సొప్పెటికి అన్నం కూడ ఇవ్వడం లేదు.

శ్రీనివాసులరెడ్డి పార్టీ వదలిపోయిన తర్వాత జిల్లాలోని అందరు తెలుగునాయకులు విమర్శించారు కాని. నారసింహారెడ్డిగారు ఇప్పటివరకు శీనయ్యను పల్లెత్తు మాట అనలేదు. ఎంతవరకు నిజమో కాని, నారసింహారెడ్డిగారు శారీరకంగా తెలుగుదేశంలోవున్నా, మానసికంగా శ్రీనివాసులరెడ్డి సాన్నిహిత్యాన్ని వదలుకోలేక పోతున్నారని చెప్తారు.

నిజానికి రమేష్‌రెడ్డికి, రామనారాయణరెడ్డి తప్ప జిల్లాతెలుగుదేశం పార్టీలో శ్రీనివాసులరెడ్డితో సంబంధాలు లేనివారు ఎవరూ కనిపించడంలేదు. రమేష్‌రెడ్డికి ఎన్టీఆర్‌పై పిచ్చి అభిమానమైతే రామనారాయణరెడ్డికి శీనయ్యపై వెర్రికోపం. తక్కిన వారందరూ పగలు తెలుగుదేశమైతే రాత్రి శీనయ్య దేశం. ఎవరు అవునన్నా ఎవరు కాదన్నా ఇది నిజం.

○ ○ ○

జిల్లా తెలుగు ఎమ్మెల్యే ఉంచకానికి మంత్రిపదవిపై ఇంకా ఆశ చావలేదు. మరెవ్యకోసహా అందరికి పదవీ తాయిలంపై మోజే ఆశే! అందుకే ఏక్షణంలో ఏపిఐవుతుందో, ఎక్కడ తప్పిపోతామోనని ఏదేదోనామెతలాగా ఎమ్మెల్యే క్వార్టర్స్ ను కనిపెట్టుకుని బ్రతుకుతున్నారు. నెల్లూరుకు ఈ ఐదుగురు ఎమ్మెల్యేలంటారా. దుట్టపు దూపుగానే! బడ్జెట్ సమావేశాల ముందుగాని, వెనుకగాని విస్తరణ జరుగుతుందనే ఆశా ఆశతో కల్లడిల్లిపోతున్నారు.

అసలు మంత్రివర్గ విస్తరణ ఇప్పుడు జరుగుతుందా? జరిగినా నెల్లూరుకు అవకాశం వుంటుందా? అన్న అనుమానాలు వుండనేవున్నాయి ★

# జనవాణి

(3వ పేజీ తరువాయి)

మధ్యపతి కాని అగ్రహారంలో ఈ మధ్య తెల్లవారుజాము దొంగతనాల జోరు పెరిగింది. వేకువనే ఇండ్లలో ఎవరో ఒకరు తలుపు తీసి, పాలప్యాకెట్లకోసం పోతుంటారు. అదమకదివుండే ఈ టైములో దొంగలు తమ హస్తలాఘవం ప్రయోగిస్తున్నారు.

నెల్లూరు -వేపకొమ్మ గోపాలరావు

## ముంగమూరువారి వీధిలో చీకటి పనులు

ముంగమూరువారివీధి ఈ మధ్య చీకటి పనులకు కేంద్రమైపోయింది. పగలు,రాత్రి తేడాలేకుండా సాగిపోతున్న ఈ విచ్చలవిడి అరికట్టడంలో పోలీసులు ఎందుకు నిర్లక్ష్యం వహిస్తున్నారో మాకు అర్థం కావడంలేదు టౌన్ నడిబొడ్డు ఇంత పబ్లిక్‌గా వ్యభిచారం జరుగుతుంటే సంసారులు కాపురాలు చేసేదెట్లా?

-ఒక పౌరుడు ★



Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press, Nellore-524001